## అథ పంచవింశో%ధ్యాయః

## దేవతలు శివుని స్తుతించుట

సనత్కుమార ఉవాచ |

అథ బ్రహ్మాదయో దేవా మునయశ్చాఖిలాస్తథా | తుష్టువుర్దేవదేవేశం వాగ్భిరిష్టాభిరానతాః || 1

సనత్కుమారుడిట్లు పలికెను -

అపుడు బ్రహ్మాదిదేవతలు మరియు మునులందరు దేవదేవుడగు శివుని నమస్కరించి ఆనందకరమగు వచనములతో స్తుతించిరి (1).

దేవా ఊచుః |

దేవదేవ మహాదేవ శరణాగత వత్సల | సాధుసౌఖ్యప్రదస్త్వం హి సర్వదా భక్తదుఃఖహా || 2

త్వం మహాద్భుత సల్లీలో భక్తి గమ్యో దురాసదః | దురారాధ్యో%సతాం నాథ ప్రసన్న స్సర్వదా భవ || 3

వేదో%పి మహిమానం తే న జానాతి హి తత్త్వతః | యథామతి మహాత్మానస్సర్వే గాయంతి సద్యశః || 4

మాహాత్మ్యమతి గూఢం తే సహస్రవదనాదయః | సదా గాయంతి సుప్రీత్యా పునంతి స్వగిరం హి తే || 5

కృపయా తవ దేవేశ బ్రహ్మజ్ఞానీ భ##వేజ్జడః | భక్తి గమ్యస్సదా త్వం వా ఇతి వేదా బ్రువంతి హి || 6

త్వం వై దీనదయాలుశ్చ సర్వత్ర వ్యాపకస్సదా | ఆవిర్భవసి సద్భక్త్యా నిర్వికారస్సతాం గతిః || 7

భ##క్త్యైవ తే మహేశాన బహవస్సిద్ధి మాగతాః | ఇహ సర్వసుఖం భుక్త్వా దుఃఖితా నిర్వికారతః || 8

దేవతలిట్లు పలికిరి -

ఓ దేవదేవా! మహాదేవా! శరణు జొచ్చు వారిని ప్రేమతో రక్షించువాడా! నీవు సర్వకాలములయందు సాధుపురుషులకు సౌఖ్యముల నొసంగెదవు ; మరియు భక్తుల దుఃఖమును పోగొట్టెదవు (2). గొప్ప అద్భుతమైన పవిత్రలీలలు గల నీవు భక్తిచే పొందదగుదువు. దుష్టులకు నిన్ను ఆరాధించుటగాని, పొందుటగాని సంభవము కాదు. ఓ నాథా! నీవు సర్వకాలములలో ప్రసన్నుడవు కమ్ము (3). వేదము కూడ నీ మహిమను యథాతథముగా నెరుంగదు. మహాత్ములందరు తమ బుద్ధికి అందినంతవరకు నీ పవిత్రకీర్తిని గానము చేయుచున్నారు (4). ఇంద్రాదులు అతి రహస్యమగు నీ మహిమను సర్వకాలములలో మిక్కిలి ప్రీతితో గానముచేసి తమ వాక్కును పవిత్రము చేసుకొనుచున్నారు (5). ఓ దేవదేవా! నీ దయచే మూర్ఖుడు బ్రహ్మజ్ఞాని యగును. నీవు సర్వదా భక్తిచే పొందదగుదువని వేదములు చెప్పుచున్నవి (6). వికారములు లేని వాడవు, సత్పురుషులకు శరణ్యుడవు, దీనుల పాలిట రక్షకుడవు, సర్వవ్యాపకుడవు అగు నీవు సర్వదా మంచి భక్తిచే సాక్షాత్కరించెదవు (7). ఓ మహేశ్వరా! అనేకులు నీ భక్తిచేతనే సిద్ధిని పొందినారు. వారు ఇహలోకములో సర్వ సుఖములనను భవించినప్పుడు, మరియు దుఃఖమును పొందినప్పుడు వికారమును పొందలేదు (8).

పురా యదుపతిర్భక్తో దాశార్హస్సిద్ధిమాగతః | కలావతీ చ తత్పత్నీ భ##క్త్యైవ పరమాం ప్రభో || 9

తథా మిత్రసహో రాజా మదయంతీ చ తత్ర్పియా | భ##క్త్యైవ తవ దేవేశ కైవల్యం పరమం య¸° || 10

సౌమినీ నామ తనయా కై కేయాగ్రభువస్తథా | తవ భక్త్యా సుఖం ప్రాప పరం సద్యోగిదుర్లభమ్ || 11

విమర్షణో నృపవరస్సప్తజన్మానది ప్రభో | భుక్త్వా భోగాంశ్చ వివిధాంస్త్వద్భక్త్యా ప్రాప సద్గతిమ్ || 12

చంద్రసేనో నృపరస్త్వద్భక్త్యా సర్వభోగభుక్ | దుఃఖముక్తస్సుఖం ప్రాప పరమత్ర పరత్ర చ || 13

గోపీపుత్రశ్శ్రీకరస్తే భక్త్యా భుక్త్వేహ సద్గతిమ్ | పరం సుఖం మహావీరశిష్యః ప్రాప పరత్ర వై || 14

త్వం సత్యరథ భూజానేర్దుఃఖహర్తా గతిప్రదః | ధర్మగుప్తం రాజపుత్రమతార్షీస్సుఖినం త్విహ || 15

ఓ ప్రభూ! పూర్వము యదువంశమునకు ప్రభువు, భక్తుడు అగు దాశార్హుడు, మరియు ఆతని భార్యయగు కలావతి భక్తిచేతనే పరమసిద్ధి (మోక్షము)ని పొందియున్నారు (9). ఓ దేవదేవా! అదే విధముగా, మిత్రసహ మహారాజు మరియు ఆతని ప్రియురాలగు మదయంతి నీయందలి భక్తి చేతనే పరమకైవల్య (మోక్ష)మును పొందినారు (10). కేకయమహారాజుయొక్క అన్నగారి కుమార్తె యగు సౌమిని అదే విధముగా నీయందలి భక్తిచే మహాయోగులకైననూ లభించని పరమసుఖము (మోక్షము) ను పొందెను (11). ఓ ప్రభూ! విమర్షణ మహా రాజు నీ భక్తిచే ఏడు జన్మలవరకు అనేక భోగములననుభవించి ఉత్తమగతి (మోక్షము) ని పొందెను (12). చంద్రసేన మహారాజు నీ భక్తిచే దుఃఖమునుండి విముక్తుడై ఇహలోకములో భోగముల నన్నిటినీ అనుభవించి దేహత్యాగానంతరము పరమసుఖమును పొందెను (13). గొల్లయువతి పుత్రుడు, మహావీరుని శిష్యుడు అగు శ్రీకరుడు నీ భక్తిచే ఇహలోకములో గొప్ప సుఖముననుభవించి పరలోకములో సద్గతిని పొందెను (14). నీవు సత్యరథ మహారాజుయొక్క దుఃఖమును పోగొట్టి సద్గతినొసంగితివి. నీవు రాజకుమారుడగు ధర్మగుప్తునకు ఇహలోకములో సుఖములనొసంగి సంసారసముద్రమును దాటించితివి (15).

తథా శుచివ్రతం విప్రమదరిద్రం మహాప్రభో | త్వద్భక్తపవర్తినం మాత్రా జ్ఞానినం కృపయా%కరోః || 16

చిత్రవర్మా నృపవరస్త్వద్భక్త్యా ప్రాప సద్గతిమ్ | ఇహలోకే సదా భుక్త్వా భోగానమరదుర్లభాన్ || 17

చంద్రాంగదో రాజపుత్ర స్సీమంతిన్యాస్త్రి యా సహ | విహాయ సకలం దుఃఖం సుఖీ ప్రాప మహాగతిమ్ || 18

ద్విజో మందరనామాపి వేశ్యాగామీ ఖలో%ధమః | త్వద్భక్తశ్శివ సంపూజ్య తయా సహ గతిం గతః || 19

భద్రాయుస్తే నృపసుతస్సుఖమాప గతవ్యథ | త్వద్భక్త కృపయా మాత్రా గతిం చ పరమాం ప్రభో || 20

సర్వస్త్రీ భోగ నిరతో దుర్జనస్తవ సేవయా | విముక్తో %భూదపి సదా%భక్ష్యభోజీ మహేశ్వర || 21

శంబరశ్శంకరే భక్త శ్చితా భస్మ ధరస్సదా | నియమాద్భస్మనశ్శంభో స్వస్త్రియా తే పురం గతః || 22

ఓ మహాప్రభూ! నీ భక్తియందు స్థిరముగా నున్న శుచివ్రతుడను బ్రాహ్మణునకు ఆతని తల్లితో సహా దయతో జ్ఞానమునిచ్చి ఆతని దారిద్ర్యమును తొలగించితివి (16). చిత్రవర్మమహారాజు నీయందలి భక్తిచే ఇహలోకములో సర్వదా దేవతలకు కూడ లభింప శక్యము కాని భోగముల ననుభవించి సద్గతిని పొందెను (17). చంద్రాంగదుడనే రాజకుమారుడు తన భార్యయగు సీమంతినితో గూడి సకలదుఃఖములనుండి విముక్తుడై సుఖములను, ఉత్తమ గతిని పొందెను (18) ఓ శివా! వేశ్యతో తిరుగువాడు, దుష్టుడు, అధముడు అగు మందరుడనే బ్రాహ్మణుడు కూడ నీ భక్తుడై నిన్ను చక్కగా పూజించి ఆమెతో సహా సద్గతిని పొందినాడు (19). భద్రాయుడనే రాజకుమారుడు నీ భక్తుని దయచే, మరియు నీదయచే దుఃఖవినిర్ముక్తుడై తల్లితో గూడి సుఖములను పొంది పరమపదమును చేరినాడు. హే ప్రభూ! (20). మహేశ్వరా! స్త్రీలందరితో భోగమునందాసక్తి గలవాడు, సర్వదా తినకూడని పదార్థములను తినువాడు నగు దుష్టుడు కూడ నిన్ను సేవించి మోక్షమును పొందెను (21). ఓ శంభూ! శంకర భక్తుడు, సర్వదా విభూతిని దాల్చువాడు నగు శంబరుడు విభూతి ధారణ నియమమువలన తన భార్యతో గూడి నీ పురమును చేరినాడు (22).

భద్రసేనస్య తనయస్తథా మంత్రిసుతః ప్రభో | సుధర్మ శుభకర్మాణౌ
సదా రుద్రాక్షధారిణౌ || 23

త్వత్కృపాతశ్చ తౌ ముక్తావాస్తాం భుక్త్వేహ సత్సుఖమ్ |
పూర్వజన్మని ¸° కీశకుక్కుటౌ రుద్రభూషణౌ || 24

పింగలా చ మహానందా వేశ్యే ద్వే తవ భక్తితః | సద్గతిం
ప్రాపతుర్నాథ భక్తోద్ధార పరాయణ || 25

శారదా విప్ర తనయా బాలవైధవ్యమాగతా | తవ భ##క్తేః ప్రభావాత్తు
పుత్రసౌభాగ్యవత్యభూత్ || 26

బిందుగో ద్విజమాత్రో హి వేశ్యా భోగీ చ తత్ర్పియా | వంచుకా
త్వద్యశశ్శ్రుత్వా పరమాం గతి మాయ¸° || 27

ఇత్యాది బహవస్సిద్ధిం గతా జీవాస్తవ ప్రభో | భక్తిభావాన్మహేశాన
దీనబంధో కృపాలయ || 28

త్వం పరః ప్రకృతేర్బ్రహ్మ పురుషాత్పరమేశ్వర | నిర్గుణస్త్రి
గుణాధారో బ్రహ్మవిష్ణు హరాత్మకః || 29

నానా కర్మ కరో నిత్యం నిర్వికారో%ఖిలేశ్వరః | వయం
బ్రహ్మాదయస్సర్వే తవ దాసా మహేశ్వర || 30

ప్రసన్నో భవ దేవేశ రక్షాస్మాన్ సర్వదా శివ | త్వత్ర్పజాశ్చ వయం
నాథ సదా త్వచ్ఛరణం గతాః || 31

ఓ ప్రభూ! భద్రసేనుని కుమారుడగు సుధర్ముడు, మరియు మంత్రిపుత్రుడగు శుభకర్ముడు సర్వదా రుద్రాక్షలను ధరించి (23). నీ అనుగ్రహమువలన ఇహలోకములో ఉచితమగు సుఖముననుభవించి ముక్తిని పొందిరి. పూర్వజన్మలో కోతి, కోడి యైన వారిద్దరు రుద్రునకు అలంకారములైరి (24). ఓ నాథా! భక్తుల ఉద్ధారమే ప్రముఖకార్యముగా గలవాడా! పింగళ, మహానంద అను ఇద్దరు వేశ్యలు నీ భక్తివలన సద్గతిని పొందిరి (25). బ్రాహ్మణుని కుమార్తెయగు శారద బాల్యములో భర్తృవియోగమును పొంది నీ భక్తి యొక్క ప్రభావమువలన పుత్రప్రాప్తి అనే

సౌభాగ్యమును పొందెను (26) నామమాత్ర బ్రాహ్మణుడు, వేశ్యాలంపటుడునగు బిందుగుడు మరియు వాని ప్రియురాలగు వంచుక నీ కీర్తిని విని, పరమగతిని పొందిరి (27). ఓ ప్రభూ! మహేశ్వరా! దీనబంధూ! కృపాసముద్రా! ఈ తీరున అనేక జీవులు నీయందు భక్తిభావము కలుగుట వలన సిద్ధిని పొందిరి (28). ఓ పరమేశ్వరా! నీవు ప్రకృతి పురుషాతీతమగు నిర్గుణ బ్రహ్మవు. నీవు త్రిగుణములను స్వీకరించి బ్రహ్మ విష్ణు రుద్రులను రూపములను దాల్చినావు (29). ఓ మహేశ్వరా! నీవు సర్వదా వివిధకర్మలను చేయుచున్ననూ నిర్వికారుడవు. బ్రహ్మాదులమగు మేము అందరము సర్వేశ్వరుడవగు నీకు దాసులము (30). ఓ దేవదేవా! ప్రసన్నుడవు కమ్ము. మమ్ములను సర్వదా రక్షించుము. ఓ శివా! నాథా! నీ సంతానమగు మేము సర్వదా నిన్ను శరణు పొందియున్నాము (31).

సనత్కుమార ఉవాచ |

ఇతి స్తుత్వా చ తే దేవా బ్రహ్మాద్యాస్సమునీశ్వరాః | తూష్ణీం బభూవుర్హి తదా శివాం ఘ్రిద్వంద్వ చేతసః || 32

అథ శంభుర్మహేశానశ్శ్రుత్వా దేవస్తుతిం శుభామ్ | దత్త్వా వరాన్ వరాన్ సద్యస్తత్రైవాంతర్దధే ప్రభుః || 33

దేవాస్సర్వేఽపి ముదితా బ్రహ్మాద్యా హతశత్రవః | స్వం స్వం ధామ యయుః ప్రీతా గాయంతశ్శివసద్యశః || 34

ఇదం పరమమాఖ్యానం జలంధర విమర్దనమ్ | మహేశచరితం పుణ్యం మహాఘౌఘ వినాశనమ్ || 35

దేవస్తుతిరియం పుణ్యా సర్వపాపప్రణాశినీ | సర్వసౌఖ్యప్రదా నిత్యం మహేశానందదాయినీ || 36

యః పఠేత్పాఠయేద్వాఽపి సమాఖ్యానమిదం ద్వయమ్ | భుక్త్వేహ పరమం సౌఖ్యం గాణపత్యమవాప్నుయాత్ || 37

ఇతి శ్రీ శివమహాపురాణ  రుద్రసంహితాయాం యుద్ధఖండే దేవస్తుతి వర్ణనం నామ పంచవింశో%ధ్యాయః (25).

సనత్కుమారుడిట్లు పలికెను-

ఆ బ్రహ్మాది దేవతలు మహర్షులతో గూడి ఇట్లు స్తుతించి శివుని పాదములపై లగ్నమైన మనస్సులు గలవారై అపుడు మిన్నకుండిరి (32). అపుడు మహేశ్వరుడగు శంభుప్రభుడు పవిత్రమగు దేవతల స్తుతిని విని శ్రేష్ఠమగు వరములనిచ్చి వెంటనే అచటనే అంతర్హితుడాయెను (33). బ్రహ్మ మొదలగు దేవతలందరు కూడ శత్రువులు నశించుటచే ఆనందించిన వారై శివుని సత్కీర్తిని ప్రేమతో గానము చేయుచూ తమ తమ స్థానములకు వెళ్లిరి (34) మహేశ్వరుడు జలంధరుని సంహరించుట అనే ఈ గొప్ప గాథ పవిత్రమైనది, మరియు మహాపాపములను నశింపచేయునది (35). ఈ పవిత్రమగు దేవతల స్తుతి పాపములనన్నిటినీ పోగొట్టి నిత్యము సర్వసుఖముల నిచ్చును. ఈ స్తుతి మహేశునకు ఆనందమును కలిగించును (36). ఈ రెండు గాథలను ఎవరు పఠించెదరో, లేదా పఠింపజేసెదరో వారు ఇహలోకములో గొప్ప సుఖమునను భవించి గణాధ్యక్షస్థానమును పొందెదరు (37).

శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖండములో దేవస్తుతి వర్ణనమనే ఇరువది అయిదవ అధ్యాయము ముగిసినది (25).